శ్రీ

# అర్ధానుస్వారతత్త్వము.

ఇది

తా. మి. ఎమ్. ఏ. శేషగిరిశాస్త్రిగారిచే

తెనుఁగు విద్యార్థుల యుపయోగార్థము

వ్రాయఁబడినది.

ద్వితీయ ముద్రణము.



**వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్,**

4. మల్లికేశ్వరస్వామిగుడిసందు, లింగిసెట్టివీథి,

జి. టి. మదరాసు.

1949.



అ 0-12-0

"సక్తుమివ తితఉనా పునంతో
యత్ర ధీరామనసావాచమక్రత,
అత్రాసఖాయ స్సఖ్యాని
జానతేభద్రైషాం లక్ష్మీర్నిహితాధివాచి."

—ఋగ్వేదము.

"పురాణమిత్యేవ న సాధు సర్వం
న చాపికావ్యం నవమిత్యవద్యం,
సన్తః పరీక్ష్యా న్యతరద్భజన్తే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః."

—కాళిదాసుఁడు.

[ప్రథమముద్రణము 1892.]

# పీఠిక

ఆంధ్రభాషాభిజ్ఞులయిన పండితులు తమ ప్రాచీన సమయాచారాదులఁ బరిపాలించునట్లు తమ భాషలను ఇతరుల యథేష్టవ్యవహారములచేఁ జెడకయుండునట్లు రక్షించుకొనుచున్నారు. భాషను జక్కఁగా జదువని సామాన్య జనులు వ్యాకరణాది ప్రమాణములు తెలియక విధివ్యవస్థలులేక శబ్దములఁ బ్రయోగించి భాషను బలుమాఱు మార్చుచున్నారు. ఇట్లుండ నేయే దేశములందు విద్య విశేషముగ వ్యాపించియుండునో ఆయా దేశంబులందుఁ బ్రాచీన గ్రంథములను జదివి వాని ప్రామాణ్యముతో శుద్ధముగా మాటలాడుటచేతను గ్రంథముల వ్రాయుటచేతను భాష మార్పులులేక విశేష స్థైర్యమును బొందియుండును. తెనుఁగునందు రమారమి వేయి సంవత్సరములకు మునుపు నన్నయభట్టారకులు వ్రాసిన వ్యాకరణమును ఆంధ్రభారతమును తెనుఁగునకు మూల ప్రమాణములుగా నుంచుకొని వెనుకనుండిన గ్రంథకర్తలు తమతమ గ్రంథములను రచియించినారు. ఇట్లు వేర్వేఱు పండితులచే రచియింపఁబడిన గ్రంథములెల్ల నీ యాంధ్రభాషకు నొక పెద్ద దుర్గమువలె సంరక్షకములుగా నున్నవి. ఈభాషలోని పద వాక్యముల స్వరూపము చక్కఁగాఁ బరిశోధించిన వారిచే రచియింపఁబడిన వ్యాకరణములు భాషను జదువఁగోరెడువారికి నత్యంతోపకారకములయి యున్నవి. భాషాసంబంధమయిన

ఒక్కొక విషయమును తెలియునట్లు కావలసిన విధులు సూత్ర రూపమునఁ జెప్పఁబడియున్నవి. అట్టి గ్రంథముల్లను జదివిన వారును తమ జ్ఞానమును దమ యుపాధ్యాయులకే సమర్పించి విధివ్యవస్థలు లేకుండ భాషను వ్యవహరించుచుండఁగా, చదువనివారి విషయమై మన మేమి చెప్పవచ్చును? ఈవఱకు వ్రాయఁబడిన వ్యాకరణములందు అనేక విషయములనుగుఱించి విధాయకములయిన సూత్రములున్నవి గాని అర్ధానుస్వారమును గుఱించి విశేష సూత్రములు లేవు. అర్ధానుస్వారము ఎక్కడ నుండవలయు? ఎక్కడ నుండఁగూడదు? దానికి సామాన్యముగఁ గారణమేది? అను నిట్టి విషయములను వైయాకరణులు తెలిసికొనకయు గ్రంథములందు వివరింపకయు విడిచిపెట్టిరి. కాఁబట్టి భాషను జదివెడువారలకు అర్ధానుస్వార స్వరూపమును దెలిసికొని దాని నుపయోగించుట బహుకష్టమయి యున్నది. విధులచే సాధింపఁబడిన శబ్దస్వరూపములను జక్కఁగాఁ దెలిసికొనక జనులు అపశబ్దములను బ్రయోగించుచుండఁగా శాస్త్రనియమములేని యీ యర్ధానుస్వారముయొక్క స్వరూపము నెట్లు తెలిసికొనగలరు? పండితులకే తెలియని విషయమును బామరు లెట్లు తెలిసికొందురు. ప్రాచీనకాలమునందు సహేతుకమయివచ్చిన అర్ధానుస్వారముయొక్క స్వరూపమును దెలిసికొనని పండితులు హేతువులేనిచోట్లను అర్ధానుస్వారము నుపయోగించియు, అది యుండవలసిన చోట్ల దానిని విడిచిపెట్టియు, లేని కలఁతలను బెట్టుకొన్నారు. పూర్వమే తెలియకపోయిన ఈవిషయము ఈతప్పులవల్ల మఱి

యు దురవగాహమయ్యె. ఇదిగాక అర్ధానుస్వారము లిపియందు
చిహ్నరూపముగా నున్నప్పటికిని ఆచిహ్నమునకు లక్ష్యమయిన
ధ్వన్యాత్మకవర్ణ మొకటియు లేదు. ఉచ్చారణమునందు లేనివర్ణ
మునకు చిహ్న మెట్లువచ్చును? పూర్వము ఈ చిహ్నమునకు
లక్ష్యమయిన ధ్వని యొకటియుండి యుండవలయు. అది ఎట్టి
ధ్వనియని విచారించినయెడల నది నకారసదృశమయి యుం
డుటచేత నది యనునాసికోచ్చారణము గలిగియుండినదని
తెలియవచ్చుచున్నది. ఈ యనునాసికధ్వని ప్రత్యేకమయిన
యొకవర్ణముగా నుండినయెడల నది యనుస్వారమయి యుండ
వలెను. అనుస్వారమును వేఱు అక్షరముగాఁ దెనుఁగువారలు
ఉచ్చరించుటచేత, అర్ధానుస్వారమునకు అనుస్వారోచ్చారణము
లేదని నిశ్చయింపవలయు. కాఁబట్టి అర్ధానుస్వారమునకుఁ
బూర్వమయిన స్వరమునకు అనునాసికోచ్చారణమే స్వరూప
మని యెఱుంగవచ్చును. ఈ స్వరూపము ఋగ్వేద యజుర్వే
దములందలి ఉచ్చారణ విశేషముచేతఁ దెలిసికొనవచ్చును.
ఎట్లనఁగా మహాన్ + ఇంద్రః అనునది ఋగ్వేదమునందు
నకారలోపమును దానికి పూర్వమయిన ఆకారమునకు అను
నాసికత్వమును రాఁగా మహాఁ ఇంద్రః అని వచ్చును. ఈ పద
ములను ఉచ్చరించునపుడు హాకారమునకు వెనుకవచ్చెడి ఆకా
రమును భాగము, నాగము మొదలయిన శబ్దములలో నాకార
మును ఉచ్చరించునట్లు ఉచ్చరింపక నాసాద్వారములో నుచ్చ
రింతురు. అట్లే మహారాష్ట్రభాషయందు తే 'అది,' తీ 'అవి,'

హే ఇది, హీ 'ఇవి' మొదలయిన పదముల యచ్చులును ఉచ్చరింపఁబడును. అట్లే తెనుంగునందు అర్ధానుస్వారము ఉచ్చరింపవలెను. ఈ యుచ్చారణము బ్రాహ్మణులలోను చదివినవారలలోను లేకపోయినను ఇతరజనులలోఁ బలుమాఱు వినవచ్చును. కొందఱు వాఁడు కోఁతకు పోయినాఁడు అనియు, మఱికొందఱు వాండు కోంతకు పోయినాండు అనియు చెప్పుదురు. ఈ యుచ్చారణములు పూర్వమునుండి వచ్చినవో వెనుకవచ్చినవో నిశ్చయముగాఁ జెప్పుట కష్టము.

ఇట్లు సాధారణముగా గ్రాంథికభాషలోను వ్యావహారికభాషలోను ఉచ్చరింపఁబడని అర్ధానుస్వారమును లిపియందు ఎందుకు వ్రాయవలయు? సంస్కృతపదములు ప్రాకృతమునకు వికృతములయి రాఁగా లుప్తమయిన వర్ణములను వ్రాయరు. అది యెట్లనఁగా,

| | |
|---|---|
| ఆణత్తం | ఆజ్ఞప్తమ్ |
| జుత్తం | యుక్తమ్ |
| జావ | యావత్ |
| తావ | తావత్ |
| తా | తత్ |

హిందూదేశములోనుండు అన్ని భాషలయందు నిదియె సంప్రదాయము. కాఁబట్టి తెనుంగునందు మాత్రము ఉచ్చరింపని ధ్వనిని ఎందుకు వ్రాయవలయునని యనేకులు వాదింతురు: దీనికిఁ బండితులు క్రిందవచ్చునట్లు సమాధానముఁ

జెప్పవచ్చును. ఈ కాలమునందు మనల నేలెడు ఆంగిలేయుల భాషను వ్రాయునప్పుడు ధ్వన్యాత్మకభాషయందు లేని అక్షరములను ఉపయోగింతురు. ఈ యశాస్త్రీయ సంప్రదాయముచేత భాష మిక్కిలి చెడిపోయినదానిచే దానిని నేర్చువారికి అతి ప్రయాసమగుచున్నది. అట్లయినప్పటికిని చక్కఁగాఁ జదివిన గుణగ్రాహులైన పండితులును పైఁ జెప్పిన మూఢసంప్రదాయమును విడువకయున్నారు.

విల్ (*Will*) అను ధాతువునుండివచ్చిన భూతార్థక పూర్ణక్రియయయిన వుడ్ (*Would*) పదములో ఉచ్చరింపఁబడని లకారము ఉండుటచేత, క్యాన్ (*Can*) అను ధాతువునుండివచ్చిన భూతార్థక పూర్ణక్రియయయిన (*Could*) కుడ్ పదమునందును లకారమును వ్రాయుచున్నారు. ఈతప్పు మొట్టమొదట బుద్ధిలేని యెవఁడో ఒకఁడుచేయఁగా దానినిఁజూచి యితరులును ముందరఁబోవు మేఁకను అనుసరించిపోవునట్టి వెనుకనుండు గుంపు మేఁకలవలె ననుసరించి పోవుచున్నారు. సకలవిషయములను చక్కఁగాఁ దెలిసి విమర్శించి గుణగ్రహణముఁజేయునట్టి ఆంగ్లేయ విద్వాంసులును ఈయంధపరంపరాప్రాప్తమయిన సంప్రదాయమును విడువకయుండఁగా తెనుఁగువారలుమాత్రము ప్రాచీనకాలమునుండి తమభాషలో నుండెడు అర్ధానుస్వారమును ఎందుకు విడువవలయు.

అదియునుంగాక అర్ధానుస్వారము శబ్దములయొక్క వ్యుత్పత్తులను భిన్నస్వరూపములయిన పదములయొక్క పర

స్వరసంబంధములనుం దెలిసికొనుటకును అనుకూలమయి యున్నది. ఈ విషయమునుగుఱించి కావలసిన యుదాహరణములను ఈ గ్రంథమునందుఁ జూడవచ్చును.

ఇట్లు అర్ధానుస్వారము ఉచ్చరింపఁబడకపోయినను పలుదెఱంగుల నుపయుక్తమగుటచే దానిని విడుచుట యుక్తము గాదు. ఇది కచ్చేరి కార్ఖానా మొదలయినవానియందు ఉపయోగించుట అనావశ్యకమయినను పండితులకును విద్యార్థులకును అత్యావశ్యక మగుచున్నది.

ఈ గ్రంథమునందు ఆంధ్రశబ్దముల స్వరూపములను జక్కఁగా దెలుపుటకు నుదాహరణములుగాఁ దేఁబడిన యఱవ పదములు దెనుఁగుననే వ్రాయఁబడియున్నవి. అరవములోనుండెడు ఴ అను అక్షరము తెనుంగునందు లేకయుండుటచేత దానికి సమానమయిన కన్నడమునందుండు ೞ అను అక్షరమును ఉపయోగించి యున్నాను. ప్రకృతివలన నుండివచ్చిన వికృతిశబ్దముల వ్యుత్పత్తిఁ జూపునపుడు ముఖ్యమయిన ప్రక్రియలనుమాత్రముఁ దెలిపి యనావశ్యకమయినవానిని విడిచిపెట్టినాను. వానిని జదువువారలు సమయోచితముగా నూహించికొనవలయు.

ఈ గ్రంథమును జదువువారు దీనియందలి సూత్రములను ఉదాహరణములను జక్కఁగాఁ దెలిసికొనుటకు ఇప్పుడు ముద్రింపఁబడునట్టి నా యాంధ్రశబ్దతత్త్వమును జదువుట మిగుల సాహాయ్యకరముగా నుండును.

శేషగిరిశాస్త్రి.

# ప్రకాశక విజ్ఞప్తి

మా మాతామహులైన శ్రీ శేషగిరిశాస్త్రిగారి యాంధ్ర శబ్దతత్త్వమును ఇటీవల మరల ముద్రించితిమి. అందు అర్ధానుస్వారముంగూర్చి వారు విపులముగా వ్రాసియున్నను వారే ప్రత్యేక గ్రంథముగా ప్రకటించియుండిన ఈచిన్నిపొత్తము విద్యార్థుల కుపయోగకరమని మరల ప్రకటించుచున్నాము. దీనికి దాదాపు అఱువదియేండ్ల ప్రాయము. ఈలో లెక్కలేని శాసనములును క్రొత్తప్రబంధములు దొరకినవి. భాషాతత్త్వశాస్త్రపరిశోధనయు జరిగినది. కాని ఇట్టి గ్రంథము వెలువడ లేదు.

అర్ధానుస్వారమును వ్రాతలో త్యజించు నీదినములలో పండితులకు భాషాతత్త్వశాస్త్రపరిశోధన నిమిత్తము అది వలసియే యున్నది. ఈపొత్తమువలన అర్ధానుస్వారము వర్ణాన్తరస్థానీయ మనియు తద్జ్ఞానమునకు ద్రావిడాది భాషల పరిచయ మావశ్యకమనియు మనము గ్రహించుచున్నాము. ఈవిషయమునే మా పితామహులు శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు ఆంధ్రభాషాసర్వస్వార్హనియమకతిపయములు అను వ్యాసమున నిట్లు వ్రాసిరి. 'శబ్దముల రూపార్థములకు శబ్దశాస్త్రము, ఆంధ్రమున భారతాదులును తాదృశప్రామాణిక ప్రయోగానుసారి నిఘంటువులును, ప్రమాణములు. ఇటీవల మహాప్రాజ్ఞులు పాశ్చాత్యవిద్వాంసులు కల్పించిన ఫైలాలజీ పేరి సర్వభాషాశబ్దవ్యుత్పత్తి సంబంధాది విమర్శనశాస్త్రము

చేత, దివ్యదృష్టిచేతనుంబోలె, అద్భుతవిషయము లనేకములు గోచరమైనవి: పంచద్రావిడభాషలు (తెనుఁగు, అఱవము, కన్నడము, తులువము, మలయాళము) పరస్పరసంబంధము కలవియని మనకు తెలిసియే యుండినది. ఇప్పుడు ఈశాస్త్రము వలన ఆ తెలివియే శబ్దముల సూక్ష్మ సూక్ష్మతరసంబంధ జ్ఞాన పూర్వకముగా రూఢిపడినది......కావున, ఈనూతన శాస్త్ర మందు నిష్ణాతత్వము వ్యుత్పత్తిసిద్ధికి మహోపకారకము. ఈ శాస్త్రము శబ్దవ్యుత్పత్తులకునికషోపలస్థానీయము.' పుటలు18,19.

కావున అర్థానుస్వారతత్త్వము నరసికొనుటకు దానిని అనుదిన రచనలయందు వాడుచు, తప్పులు పోయిన దిద్దుకొనుచు, ఎప్పటికప్పుడు జ్ఞానాభివృద్ధిచేసికొనుచు పండితులును, ఉపాధ్యాయులును విద్యార్థులును దానిని శాశ్వతముగ అవలంబించియుండుట మంచిది. అట్లే శబ్దస్వరూపవ్యాకరణాదులకై గ్రాంథికమును.

తెనుఁగుభాష తత్సమతద్భవదేశ్యమిశ్ర మగుటచేత అఱవలంగూర్చి తాత్కాలికముగా మన యభిప్రాయము లెట్టివైనను, తెనుఁగు ప్రాకృతభవమని పండితులు వాదించినను, తమిళముతో కొంతకు కొంత సంబంధమున్నదనుట నిర్వివాదాంశము. ఇటీవల కొందఱు పండితులు తమిళము సైతము ప్రాకృతభవమనిరి. వీని నెల్లం జూడఁగా పరిశోధనకు గల యవకాశము అనంతమని తెలియుచున్నది.

15-3-49 }
మదరాసు } వేదము వేంకటరాయశాస్త్రి M. A.

ఈ గ్రంథమందు నుపయోగింపఁబడు చిహ్నములు.

అ. అఱవము.

తె. తెనుఁగు.

క. కన్నడము.

మ. మళయాళము.

భా - నా. భావనామము.

ఈ గ్రంథమునం దుపయోగింపఁబడెడు
ముఖ్య పారిభాషిక పదము

అఱవమునుండి హలంత పదములు తెనుంగునకు వచ్చునపుడు అంతమునందు అ, ఇ, ఉ మొదలయిన ప్రత్యయములను బొందును. అట్టి ప్రత్యయములకు అంతప్రత్యయములని పేరు. ఆంధ్రశబ్దతత్త్వము ౧౬-వ పుట చూచునది.

శ్రీ

# అర్ధానుస్వార తత్త్వము.

**1.** అర్ధానుస్వారము ఒకపదమునందుగాని అనేకపదముల మధ్యమునందుగాని లుప్తమయిన హల్లుయొక్క స్థానమందు వచ్చును.

౧. యకారాంత ధాతువులకు భావార్థమునందు త ప్రత్యయమురాఁగా ధాత్వంత యకారములోపించి, దానిస్థానమునందు అర్ధానుస్వారము వచ్చును.

మేఁత = మేయు+త=మేయ్+త=మేఁత.

ఇట్లే

ప్రేఁత = ప్రేయు+త.
వ్రాఁత = వ్రాయు+త.
కూఁత = కూయు+త.
నేఁత = నేయు+త.
చేఁత = చేయు+త.
పోఁత = పోయు+త.
గీఁత = గీయు+త.
పూఁత = పూయు+త.
రోఁత = రోయు+త.

## అర్ధానుస్వారతత్త్వము.

మోఁత = మోయు+త.

మ్రోఁత = మ్రోయు+త.

లాఁత = లాయు+త.

కోఁత = కోయు+త.

నవఁత = నవయు+త.

అలఁత = అలయు+త.

విధిచేత రావలసినవి:—

తీయు+త = తీఁత.

పాయు+త = పాఁత.

రాయు+త = రాఁత.

మాయు+త = మాఁత.

కలయు+త = కలఁత.

మొనయు+త = మొనఁత.

వలయు+త = వలఁత. ఇట్లు విధిచేత రావలసిన తీఁత మొదలగు పదములు లక్ష్యమందు లేవు.

పైఁజెప్పిన త ప్రత్యయము కొన్ని నకారాంతధాతువులకు రాఁగా ధాత్వంతనకారము లోపించును. లుప్త నకార స్థానమునందు అర్ధానుస్వారము వచ్చును.

ఊఁత = ఊను+త.

ఈఁత = ఈను+త.

కూఁక = కూయు+క. భావార్థక క ప్రత్యయము పర

మగునపుడు ధాత్వంత యకారమునకు లోపము.

పూఁపు = పూను+పు. భావార్థక పు ప్రత్యయము రాఁగా ధాత్వంత నకారమునకు లోపము, దానిస్థానమునందు అర్ధానుస్వారము.

ఈ రెండు పదములందు, క, పు అనునవి భావార్థ ప్రత్యయములు.

2. యకారాంతములయిన అరవధాతువులు తెనుఁగునందు గు ప్రత్యయమును బొంది యకారస్థానములో అర్ధానుస్వారము కలిగియుండును.

తె. మూఁగు ... అ. మూఁయ్.

,, కాఁగు ... ,, కాఁయ్.

,, తోఁగు ... ,, తోఁయ్.

,, వేఁగు ... ,, వే. వే అను అరవధాతువును వేఁయ్ అని యకారాంతముగాఁ జేసికొని దానికి గు ప్రత్యయముఁ జేర్పఁగా వేఁగు అని వచ్చినది.

,, మాఁగు ... ,, మాఁయ్.

3. క్రిందఁ జెప్పఁబడిన అడంగు మొదలయిన ధాతువు

లలో, అర్ధానుస్వారము పూర్ణానుస్వారమునకు బదులుగా వచ్చినది. ఆ పూర్ణానుస్వారమును అరవపదముయొక్క ఙకార స్థానమునందు వచ్చునది.

తె. అడఁగు, అడంగు ... అ. అడఙ్గు.
,, మడఁగు, మడంగు ... ,, మడఙ్గు.
,, తోడఁగు, తోడంగు ... ,, తోడఙ్గు.
,, పెనఁగు, పెనంగు ... ,, పిణఙ్గు.
,, వీఁగు ... ,, వీఙ్గు.

దీర్ఘమునకు పైని పూర్ణానుస్వారము ఎల్లప్పుడును ఖండముగానే యుండును.

తె. లాఁగు ... సం. లంఘనమ్.
,, మూఁగ ... అ. మూఙ్గై, ,, మూకః.
,, రోఁకలి ... ,, ఉరోఙ్గల్,, ఉలూఖలః
,, పలుఁగు, పలుంగు ... ,, పళిఙ్గు ,, స్ఫటికః.

సంస్కృతమునందలి మూకః, స్ఫటికః, ఉలూఖలః అను శబ్దములలో లేని ఙకారము అరవమునందు వచ్చినది. అదియే తెనుఁగునందు అర్ధానుస్వార మయినది.

తె. ఊఁదు ... అ. ఓఙ్గు.
,, వెలుఁగు, వెలుంగు... ,, విళఙ్గు.
,, మణుఁగు, మణుంగు... ,, మణఙ్గు.

తె. సుఱుఁగు, సుఱుంగు... ,, శుఱుఙ్గు.
,, ఒదుఁగు, ఒదుంగు ... ,, ఒదఙ్గు.
,, నాఁగెలు ... ,, సం. లాంగలమ్.
,, కలఁగు, కలంగు ... ,, కలఙ్గు.
,, నీఁగు ... ,, నీఙ్గు.
,, నడుఁకు, నడుంకు ... అ. నడుఙ్గు.
,, తరఁగ, తరంగ ... సం. తరంగః.
,, దాఁగు ... ,, తఙ్గు.
,, జోణఁగి, జోణంగి ... ,, శోణఙ్గి.
,, సివ్వఁగి ... ,, శివిఙ్గి.
,, వేఁగి ... తె. వెంగి.

ఈ శబ్దము ప్రాచీన శాసనములందు హ్రస్వమయిన ఎకారమును దానికివెనుక పూర్ణబిందువును గలిగియుండును. ఎకారము దీర్ఘము కాఁగా పరమయిన పూర్ణానుస్వారము అర్ధానుస్వారమయ్యె.

ర. క్రిందవచ్చు పదంబులందు ఇకారముయొక్క స్థానమునందు అర్ధానుస్వారము వచ్చియున్నది.

తె. సైఁచు ... తె. సహించు. చకారమునకు పూర్వమున నుండు అనుస్వారము ఇకారతుల్య మగుట చేత ఇది ఇక్కడ వ్రాయఁబడియె.

,, కణఁజము, కణంజము. అ. కళఞ్జియమ్.

,, కముఁజు, కముంజు... సం. కపిఞ్జలః.

కవుఁజు, కౌఁజు అనియు రూపభేదము కలదు.

,, పీఁచము ... సం. పిఞ్ఛమ్.

౫. దిగువవచ్చు పదంబులందు అర్ధానుస్వారము ణకార స్థానములో వచ్చుచున్నది.

తె. ఏఁడు ... అ. ఆణ్డు.

,, వేఁడు ... ,, వేణ్డు.

,, వాఁడు ... ,, అవన్ శబ్దము ఉ ప్రత్యయముచేరఁగా అవండు అయినది. పదాదియయిన అకారము వకారమునకు వెనుకనుండెడు అకారస్థానమునకు దుమికివచ్చి దానికి ఆదేశమయి ఆకారమగుచున్నది. కాఁబట్టి అవండు, వాండు అగును. దీర్ఘమునకు వెనుకనుండు పూర్ణానుస్వారమునకు అర్ధానుస్వారాదేశము నిత్యమగుటచే వాండు వాఁడు అయ్యె.

ఆంధ్ర. తత్త్వ. ౧౦ పు. చూడుము.

తె. వీఁడు ... అ. ఇవణ్. ఇవణ్+ఉ=ఇవండు
=వీండు=వీఁడు.

,, ఎవఁడు ... ఎవణ్. ఎవణ్+ఉ = ఎవండు
=ఎవఁడు.

డకారమునకుముందు ఉండు అర్ధానుస్వారము ణకారముయొక్క స్థానమందు వచ్చినది.

తె. చేయఁడు, చేయండు .. అ. శెయ్యాన్.

,, కాఁడ ... సం. కాండః.

,, కోఁతి ... క. కోడతి. డకారములోపించి దానికి పూర్వమున నుండు ఒకారము దీర్ఘమయ్యె. డకారము యొక్క స్థానములో అర్ధానుస్వారము. మఱియు డకారమునకు పూర్వముగ నుండు ఒకారము, డకారమునకు వెనుకనుండు అకారస్థానమునకు దుమికివచ్చి దానికి ఆదేశము అయి దీర్ఘము కాఁగా క్డోఁతి అని నిలుచును. డకారమునకు రేఫాదేశము కాఁగా క్రోఁతి అనురూపము

వచ్చును. ఈ క్రోతి అను రూపమునందు అర్ధానుస్వారమునుంచుట వ్యాకరణవిరుద్ధము.

(3 =వ పు. చూడుఁడు.)

తె. గరిఁటె ... అ. కరణ్డీ.

,, గూఁడు ... ,, కూణ్డు.

,, దాఁటు ... ,, తాణ్డు.

,, అఁట ... తె. అంటారు (అనుతారు) అను నది అను ధాతువుయొక్క వర్తమానార్థక ప్రథమ పురుష స్త్రీ పుంలింగ బహువచనము. ఇది గ్రామ్యము. పదాంతమునందుండు రుకారము లుప్తముకాఁగా పూర్వమయిన ఆకారము అకారమయ్యె. ఈ ప్రక్రియచేత అంటారు అంట అని అయినది. పూర్ణానుస్వారము అర్ధానుస్వారము కాఁగా అఁట అయ్యె. దీనికి "అని చెప్పుచున్నారు" అని యర్థము.

వాఁడువచ్చినాఁడఁట "వాఁడు వచ్చినాఁడని జనులు చెప్పు చున్నారు." కొన్ని దేశము లందు బ్రాహ్మణులు ఈపద ముయొక్క టకారమునకు షకారాదేశముఁజేసి, వాఁడు వచ్చినాఁడష అనియుఁ జెప్పుదురు. ఇది అటువంటి అను పదమును అషువంటి అని చెప్పినట్లు ఉన్నది.

తె. మోఁకాలు ... అ. ముటజ్గాల్. క. మొణగాలు. కన్నడపదముయొక్క ణకారము లోపించి దానికి పూర్వమున నుండు ఒకారము దీర్ఘము కాఁగా మోఁకాలు అయ్యె. లుప్తమయిన ణకార స్థానములో అర్ధానుస్వారము.

గోరఁట }
గోరంట } ... సం. కురంటకః

చుఁడు, చుండు ... తె. చూడుండు. ఈ పదము యొక్క నడుమనుండు డకారోకారములు లోపించి పూ

ర్వమున నుండు ఊకారము హ్రస్వము కాఁగా చుండు వచ్చె. పూర్ణానుస్వారమునకు అర్ధానుస్వారాదేశము పాక్షికము.

౬. క్రిందవచ్చు పదములందు నకారస్థానములో నర్ధానుస్వారము.

తె. మూఁడు ... అ. మూన్డు. ఱకారమునకు డత్వము.
,, లేఁత ... ,, ఇళన్దై
,, మడఁత ... ,, మడన్దై
,, ఈఁదర ... ,, శీన్దల్. ఆద్యశకారమునకు లోపము. అకారము అంత ప్రత్యయము. లకారమునకు రేఫాదేశము.
,, పీఁపు ... ,, పిన్బు. పకారమునకు వత్వము. బకారమునకుపత్వము. నకారలోపము. నకారమునకు పూర్వమయిన ఇకారమునకు దీర్ఘము.
,, చెలఁది, చెలంది ,, శిలన్ది

తె. చాఁదు ... ,, శాన్దు

,, చీఁదు ... ,, శీన్దు

,, చేఁదు ... ,, శేన్దు

,, ఈఁదు ... ,, నీన్దు, పదాదినకారమునకు లోపము.

,, తాఁడి ... ,, తాన్ఱి, అకారమునకు డత్వము.

,, తోఁచు ... ,, తోన్ఱు, అకారమునకు చత్వము.

,, దాఁక ... తె. దనుక. క. తనక అ. తన్నైక్కుమ్

వచ్చు+దాఁక } క. బరువ
వచ్చు+దనుక } తనక.

అ. వరున్దనైక్కుమ్. నకార లోపము. పూర్వమున నుండు అకారమునకు దీర్ఘము. తకారమునకు సంధిచేత దత్వము. వచ్చున్ + తాఁక = వచ్చుదాఁక. వచ్చున్ అనుపదము యొక్క తుదినుండు నకారమునకు లోపము.

,, నేఁడు ... అ. ఇఞ్ఞాన్ఱు, లేక ఇన్నాన్ఱు. అకారమునకుడత్వమురాఁగా ఇన్నాండు, ఇన్నాఁడు అని మాఱినది, ఇకారము నకార

ద్వయమునకు వెనుకనుండు ఆకారస్థానమునకు దుమికి వచ్చి ఏకారము కాఁగా నేఁడు అని వచ్చెను.

తె. నాఁడు ... అ. అఙ్ఞాన్లు. దీనికి పూర్వరూపము అన్నాన్లు; ఇదియే నాఁడు అయినది.

,, బాఁపఁడు
,, బాఁపండు } అ. పార్ప్పాౕ; సం. బ్రాహ్మణః.

బ్రాహ్మణ శబ్దముయొక్క తుదియకారమునకు లోపము. అది హిందూస్తానిభాషలో బొమ్మౕ అని వికృతమైనట్లు అరవమునందు పార్ప్పాౕ అనియు, ప్రాఁత కన్నడము నందు పార్వమ్ అనియు, కొత్తకన్నడమునందు హారు వను అనియు వికృతమయ్యె. పార్ప్పాౕ శబ్దములో అంత మునందు ఉ ప్రత్యయమును, దానికి పూర్వము డకార మును, అంత్య నకారమునకు

పూర్ణార్ధానుస్వారాదేశము
లును, రేఫమునకు అర్ధాను
స్వారాదేశమును రాఁగా
బాఁపఁడు అని వచ్చెను.

తె. బాఁతి-'ప్రేమ' ... సం. భ్రాంతి-'భ్రమ'
,, కొలఁకు, కొలంకు ... తె. కొలను+కు
,, కొలఁకులు,కొలంకులు... ,, కొలను+కులు.

కుళమ్ అను అరవపదమునకు
అంత్య ప్రత్యయమయిన ఉ
కారమును జేర్చి మకారమును
నకారముగామార్చి ఉకార
మునకు ఒత్వాదేశముఁ జే
యఁగా కొలను అను
రూపము వచ్చెను. అట్లే అ.
కుళజ్గళ్ అనుపదము తెనుఁ
గున కొలంకులు, కొలఁకులు
అని వచ్చినది. వీనిలో కొలం,
కొలఁ అనునవి నామభాగ
ములు. ప్రత్యయభాగము
కులు (గళ్=కులు). ఇట్లుండ
తెనుఁగువారలు ఈ ప్రత్యయ
భాగమయిన కులు అనుదాని

యందు ఉలు అనుదానిని మాత్రము ప్రత్యయముగా గ్రహించి మిగిలిన కకారము నకు ఉకారమును జేర్చి, దానిని కొలం, కొలఁ అను నామ భాగములకుఁ బాక్షికముగాఁ జేర్పఁగా, కొలంకు, కొలఁకు అనురూపములు సిద్ధించె.

క్రిందవచ్చు కొన్ని ఉదాహరణములును ఇట్లే వచ్చినవి:—

| | | | |
|---|---|---|---|
| తె. | కలఁకు, కలంకు | ... | తె. కలను+కు |
| ,, | కలఁకులు, కలంకులు | ... | ,, కలను+కులు, అ. కలన్ గళ్; కలఙ్—'కలహము.' |
| ,, | నెఱఁకు, నెఱంకు | ... | ,, నెఱను+కు |
| ,, | నెఱఁకులు, నెఱంకులు | ... | ,, నెఱను + కులు; అ. నిఱన్ గళ్. నిఱన్—'వక్షఃస్థలము.' |
| ,, | గవఁకు, గవంకు | ... | ,, గవను+కు |
| ,, | గవఁకులు, గవంకులు | ... | ,, గవను+కులు. |

తె. వలఁకు, వలంకు ... తె. వలను+కులు; అ. పుఱన్ గళ్; పుఱ్- 'ప్రక్క'.

,, మ్రాఁకు ... ,, మ్రాను+కు

,, మ్రాఁకులు ... ,, మ్రాను+కులు, అ. మరన్ గళ్.

,, గోఁగు ... ,, గోను×గు

,, గోఁగులు ... ,, గోను+గులు

,, రేఁగు ... ,, రేను+గు

,, రేఁగులు ... ,, రేను+గులు

,, ఇఁకన్, ఇంకన్ ... ,, ఇని+కాన్. అ. ఇని+ ఆగ. ఇని – 'ఇప్పుడు', ఆగ–'కాన్', అనఁగా 'ఈకాలము కాఁగా', ఈకాలమందు అని యర్థము.

,, కొలఁది, కొలంది ... ,, కొలనిది, కొలను – 'ప్రమాణము,' కొలనిది–ప్రమాణము కలిగినది.' దకారమునకు పూర్వమునందుండు ఇకార నకారములు

లోపింపఁగా కొలంది,
కొలఁది అనురూపము
లు వచ్చినవి.

తె. పూఁబోఁడి ... తె. పూవునుబోలినది.పూ
వునుఅనుపదము పూం
అనియు,పోలినది అను
నది పోఁడి అనియు
వికృత మ యి న ది.
పూం+పోఁడి = పూఁ
బోఁడి. బోఁడిపదము
లో నకారస్థానమందు
అర్ధానుస్వారమువచ్చి
నది. ఈ బోఁడి యను
నదియే బోటియని
మాఱినది.

౭. క్రిందవచ్చు పదములందు అర్ధానుస్వారము మకారమునకు ఆదేశము.

తె. వేఁప ... అ. వేమ్బు. మకారము
తోఁ జేరిన బకారము
అంతమందు గలిగిన
పదములు తెనుఁగునకు

రాఁగా, ప్రథమావి
భక్తియందు బకార
ము లోపించును.

| | | | |
|---|---|---|---|
| తె. వేము | ... | అ. వేమ్బు | |
| ,, పాము | ... | ,, పామ్బు | |
| ,, ఇనుము | ... | ,, ఇరుమ్బు | |
| ,, తూము | ... | ,, తూమ్బు | |
| ,, జనుము | ... | ,, శణమ్బు | |
| ,, కడము* | ... | ,, కడమ్బు | |
| ,, ఇడుము* | ... | ,, { ఇడుమ్బై / ఇడుమ్బు | |
| ,, కసుము † | ... | ,, కరుమ్బు | |
| ,, ప్రేము | ... | ,, పెరమ్బు | |
| ,, అమ్ము | ... | ,, అమ్బు | |
| ,, ఎమ్ము | ... | ,, ఎలుమ్బు | |

ఈ పదములయందు షష్ఠీవిభక్తి ప్రత్యయమయిన అ అనునది కడపటరాఁగా, ప్రథమయందు లోపించిన బకారము తిరిగివచ్చి పకారమగును.

---

* ప్రయోగమునందు కడిమి, ఇడుమ యని యున్నవి.

† తృణవిశేషము.

వేము+అ, 'వేముయొక్క' అనియర్థము.

వేము+అ = వేమ్+బ్+ఉ+అ

= వేమ్బు+అ; ఉకారలోపము.

= వేమ్బ; మకారమునకు పూర్ణానుస్వారము ఆదేశమయి రాఁగా

= వేంప ) దానికి అర్ధానుస్వా
= వేఁప ) రాదేశము.

ఇట్లే.

తె. పాఁప ... అ. పామ్బు+అ

,, ప్రేఁప ... ,, పెరమ్బు+అ

జనుఁప

ఇనుఁప

కడఁప

ఇదుఁప

తూఁప

కనుఁప.

ఈరూపములు శాస్త్రమువలన సిద్ధించునవి. అయినను ప్రయోగమునందు కానఁబడవు.

క్రిందవచ్చు తెనుఁగుపదములను అరవపదములతోఁ బోల్చి చూడుము.

| | | | |
|---|---|---|---|
| తె. వేఁపమ్రాను | ... | అ. | వేప్పమరమ్ |
| ,, ఇనుపబాన | ... | ,, | ఇరుప్పుప్పానై |
| ,, జనుపనార | ... | ,, | శణప్పునార్ |
| ,, కడపమ్రాను | ... | ,, | కడప్పమరమ్ |
| ,, పసిఁడి, పసిండి ... | ... | ,, | పశుమ్ అనునది నామములకుముందు విశేషణముగా వచ్చును. అది పయిమ్ అనియు పైమ్ అనియు వికృతమగును, దానికి పచ్చ, లేఁత అనియర్థము. పయిమ్ అనుదానియందు మకారమునకు నకారమును యకారమునకు సకారమును ఆదేశమై రాఁగా, పసిఁ అని వచ్చును; ఇకారము అంత్యప్రత్యయమయి రాఁగా పసిన్ + ఇ అని నిలుచును. |

పసిఁ + ఇ = పసిన్ + డ్ + ఇ

= పసిన్డి

=పసిండి

=పసిఁడి.

పసిఁ యొక్క నకారమునకును ఇప్రత్యయమునకునునడుమ నడుమ డకారము ఆగమము.

అరవప్రత్యయము అన్ అనునది అందు అయినట్లు.

| | |
|---|---|
| తె. పసిఁడిగంటి<br>పైఁడిగంటి | అ. పైజ్ఞణి. |
| పసిఁడితామర<br>పైఁడితామర | ,, పైన్దామరై. |
| పసిఁడిచిలుక<br>పైఁడిచిలుక | ,, పైఁజ్ఞిళి. |
| పసిఁడిబిడ్డ<br>పైఁడిబిడ్డ | ,, పైమ్బిళ్ళై. |

పయిఁ+డి=పయిఁడి అనియుఁ గలదు. పయిఁ యొక్క యకారమునకు సత్వమురాఁగా పయిఁ పసిఁ అయ్యె. అ. ఉయిర్ తె. ఉసురు అని అయిన దానిఁజూడుము.

తె వేఁడి * ... అ. వెమ్. ఈపదము 'వేఁడి అయిన' అను అర్థముతో నామములకు ముందు విశేషణముగా వచ్చును.

వెమ్+ఇ=వేఙ్+డ్+ఇ
=వేన్డి
=వేండి
=వేఁడి.—పసిఁడిశబ్దమువలె.

,, వేఁడికంటి ... అ. వెంగణ్ణి.

వేఁడినీరు
వేన్నీరు } ... ,, వెన్నీర్.
వేనీరు

లో. దిగువవచ్చెడు ఉదాహరణములందు య లోపము దాని స్థానమునందు అర్ధానుస్వారము.

తె. మూఁపు ... తె. మోయ్+పు
,, = మోఁపు. ఓకారమునకు ఊకారము ఆదేశము.

---

* ఇట్లే అ. మావిన్పటమ్, క. మావినహణ్ణు, తె. మామిడిపండు. మావిన్ అను అరవ షష్ఠ్యంతనామమునకు ఇకారము అంత ప్రత్యయమురాఁగా, మావిన్+ఇ = మావిని అనివచ్చును. మావిన్+డ్+ఇ = మామిఁడి. వకారమునకు మత్వము. డకారాగమము. శాస్త్రముచే సిద్ధించిన అర్ధానుస్వారము ప్రయోగమునందులేదు.

అ. మొయ్మ్బు.

తె. వాఁపు ... క. బాయు+పు

=బాఁపు

=వాఁపు, క. బాయు - 'వాఁచు'

క. బాపు, బాపు.

,, కాఁపు ... అ. కాయ్+పు

=కాఁపు.

,, కాఁపడము, కాఁపుడు ,, కాయ్ప్పదు= కాఁపుడు.

కాఁపడము. అమ్ ప్రత్యయము అంతమందువచ్చె' డకారమునకు పూర్వమయిన ఉకారమునకు అకారము. (సమీకరణ విధి చూడుము).

౯. దిగువవచ్చు పదములందు రేఫలోపము.

తె. బాఁపఁడు ... అ. పార్ప్పాన్

,, బీఁట ... ,, పిరిదల్. తల్ భావార్థక ప్రత్యయము. దాని తకారము తెనుఁగున టత్వమును బొం

డెను. లకారమునకులోపము.
పిరిధాతువుయొక్క పకారము
నకు బత్వము.
పిరిదల్=బిరిట=బీఁట, రిలోపము.
దానికి పూర్వమయిన ఇత్తు
నకు దీర్ఘము.

౧౦. క్రిందవచ్చు పదంబులందు, టకారములోపింపఁగా దానిస్థానమునందు అర్ధానుస్వారము వచ్చినది.

తె. ప్రూఁడు } ... అ. పొటుదు, ఒకారమునకుఉత్వము.
ప్రూఁట } టకారమును దానిలోఁజేరిన ఉకారమును లోపించినవి, టకారస్థానమునందు అర్ధానుస్వారము. లోపించిన టకారమునకు పూర్వమందున్న ఉకారమునకు దీర్ఘము.

౧౧. దిగువవచ్చెడు ఉదాహరణములు సమస్తపదములు. వానియందు పూర్వపదాంతమునందుండు హల్లులు లుప్తముకాఁగా వాని స్థానములందు అర్ధానుస్వారములు వచ్చియున్నవి.

ఏఁబది =ఏను+పది. అ. ఐమ్బదు.
కాఁబోలు =అగును+పోలు=కాన్+పోలు, అ. ఆమ్బోలుమ్.

చక్కఁబడు=చక్కన+పడు; చక్కన - 'చక్కఁదనము;' పడు= 'కలుగుట.'

మెత్తఁబడు=మెత్తన+పడు, మెత్తన - 'మృదుత్వము.'

ఒడఁబడు =ఒడఁ్+పడు, అ. ఉడన్+పడు; ఉడన్-'తోడఁ్' పడు - 'అదు', సమ్మతిపడు అని అర్థము.

ప్రాఁబడు =ప్రాఁ్+పడు, అ. పఴంగెంపు=తె. ప్రాగెంపు. దీని యందు పఴం అను అరవ విశేషణము ప్రాఁ్ అని తెనుఁగునకువచ్చె. దానితో పడు ధాతువురాఁగా ప్రాఁ్ + పడు అని వచ్చును. ప్రాఁ్-'ప్రాత', పడు-'అగుట' అని అర్థము.

కూడఁబడు =కూడఁ్+పడు; కూడఁ్-కూడుధాతువునకు తుము న్నర్థరూపము; 'తోడఁ్' అనియర్థము.

కాఁబట్టి =కాఁ్+పట్టి; కాన్ 'అగుట', పట్టి-'దానినిపట్టి' 'అగుటనుపట్టి' అనఁగా - 'పూర్వము చెప్పిన సంగతి అగుటనుపట్టి' అని యర్థము; 'అగుట కారణముగా' అని తాత్పర్యము. 'రాముఁడు అయోధ్యకు వచ్చినాఁడు. కాఁబట్టి జనులు సంతసించిరి'. రాముఁడు వచ్చినాఁడు అను సంగతి అగుటనుబట్టి జనులు సంతసించిరి. సంతసించుటకు అగుట కారణము.

రాఁబట్టు =రాక్ +పట్టు.

ఔఁగదె =అగును+కాదు+ఎ; అగును - 'చెప్పినట్లు అగును.' అని సమ్మతించుట. కాదె-'అట్లుకాదా' అని ఎదురువాని సమ్మతియడిగి వాఁడు కూడ 'అగును' అని చెప్పుటను తానే సంభావించికొనుట.

=అవును+కదె, ఔనుకదె; అగునుయొక్క గకారమునకు వత్వముకాఁగా, అవును అని సిద్ధించును. అకార వుకారములకు ఔకారాదేశము.

ఔఁగాక =అగును+కాక. అగును అనునది పైఁజెప్పినట్లు ఔను అగును. అగును అని సమ్మతించి చెప్పి వెనుక అది యట్లుకాకయని కాక శబ్దముచేత, ప్రార్థన ఆజ్ఞ మొదలయిన అర్థమును వాక్యము తెలియఁబఱచుచున్నది.

చెల్లఁబో =చెల్లదు+పో. చెల్లదు - 'అట్లు జరగదు', పో - 'నీవు పొమ్ము' అని యసమ్మతిని దెలుపుచున్నది.

అ. వేణ్డాదు అనునది వేణ్డామ్ అని మాఱునట్లు చెల్లదు అనునది చెల్లక్ అని మాఱును.

సాఁబాలు =సగము+పాలు. సగము కోరు సంగోరు అని వచ్చినట్లు సగముపాలు సంబాలు అనివచ్చె. అనుస్వారమునకు పూర్వముననుండు అకారమునకు దీర్ఘము రాఁగా సాంబాలు అనివచ్చి, దీర్ఘమునకు పరమయిన పూర్ణానుస్వారము ఖండముగాఁగా సాఁబాలు అనివచ్చె.

ఆఁబోతు =అ. ఆన్+పోత్తు. ఆన్—'ఆవు'. ఆన్ శబ్దమే అంత ప్రత్యయమయిన ఉకారము అంతమందు గలిగి, ఆను ఆయెను. ప్రా. క. నీన్ అను నది క్రొ. కన్నడమున నీను అయి తెనుఁగున నీవు అని వచ్చినట్లు ఆను అనునది తెనుఁగున ఆవు అయ్యె.

ఆఁదోఁక =అ. ఆన్తోన్గై.

తేఁజెట్టు = ,, తెన్నంశెడి, తైనెన్ + శెడి. శెడి పదమునకు బదులుగా చెట్టుపదమును బెట్టినఁ దెన్నంజెట్టు అని వచ్చును. అదియే తేంజెట్టు అని సంక్షిప్తమయి దీర్ఘమునకు పరమయిన అనుస్వారమునకు ఖండత్వము రాఁగా, తేఁజెట్టు అయ్యె.

త్రాఁగుఁబోతు=తె. త్రాగున్ + పోతు. త్రాగున్ అనునది త్రాగు అను ధాతువువలనఁ బుట్టిన భవి

ష్యదర్థకనామ విశేషణము. పకారము
నకు బత్వము. నలోపము. లుప్తనకార
స్థానమునందు అర్ధానుస్వారము.

మోఁచెయి =క. మొణకై. కై పదమునకు బదులుగా చెయి
అనునది రాఁగా మొణచెయి అనివచ్చి
మోఁచెయి అని సిద్ధించినది.

లేఁబగలు =అ. ఇళమ్పగల్; ఇళమ్ అను విశేషణపదము
= లేంబగలు; వర్ణప్లుతి విధిచేత లేం అయ్యె;
= లేఁబగలు. పగల్ శబ్దము అంత ప్రత్య
యమయిన ఉకారముతోఁజేరి
పగలు అయ్యె.

లేఁబ్రొద్దు =అ. ఇళమ్పొళుదు;ఇళమ్ లేమ్ అనియు;పొళుదు
= లేంబ్రొద్దు; ప్రొద్దు అనియు వికృతమయ్యె.
= లేఁబ్రొద్దు.

లేఁగటి =అ. ఇళజన్ఱు+ఉ. ఇళమ్–'లేఁతయయిన', కన్ఱు–
=,, ఇళజన్ఱు; 'దూడ'; ఉకారము షష్ఠీప్ర
త్యయము. 'లేఁతదూడ గలి
గిన' యని యర్థము.
= లేగంటి; ఉప్రత్యయమునకు బదులుగాఁ
= లేఁగటి దెనుఁగున ఇప్రత్యయము. ఱ
కారద్వయమునకు టకార ద్వ
యము ఆదేశము. అ. పుఱ్ఱు
తెనుఁగున పుట్ట అగును.

తేఁగొమ్ము =అ. ఇళజ్గొమ్ము,
తేఁబూ =,, ఇళమ్బూ.
ప్రాఁగెంపు =,; పటజ్గెమ్పు. ప్రాఁబడు చూడు.
తేఁటి =,, తేనినీ= తేనిన్-'తేనెయొక్క', ఈ-'ఈఁగ'; తేనిఁ అనుదానికి తెనుఁగున షష్ఠ్యర్థ ప్రత్యయమైన ఇకారము చేరఁగా తేనిని అని వచ్చెను, మొదటి ఇకారమునకు ఎత్వమును రెండవ నకారమునకు టత్వమును రాఁగా తేనెటి అని సిద్ధించును. తేనెటి - 'తేనెయొక్క' అని యర్థము. దానికి ఈఁగ అను పదమును చేర్పఁగా తేనెటీఁగ అని వచ్చును. కడపటనుండు ఈఁగ అను పదమునకు బదులుగా ఈ అను మూలమయిన అరవపదమును చేర్పఁగా తేనెటీ అని వచ్చును. దీనియందలి ఎకారమునకు లోపముఁ జేసి నకారస్థానములో అర్ధానుస్వారము నుంచినయెడల తేఁటి అని వచ్చును. ఈ పదము అర్థభేదముచేత భ్రమరమునకు పేరయినది. *

---

* సంస్కృతమునందు పుష్పలిట్ అనుపదము పుష్పమందలి తేనె త్రాగుటచేత సాధారణముగాఁ దుమ్మెదకు పేరయినది. మిళిందః అనుపదము గ్రీక్కునందు తేనెకు పేరయిన మిలిత్త అనుపదమునుండి వచ్చినది.

పక్షాంతరమునందు,

అరవమునందు తేన్ పదముతో ఈ అను పదము చేరఁగా షష్ఠీసమాసమునందు, నకారమునకు పాక్షికముగా తకారద్వయము ఆదేశము అగుటచేత తేనీ తేత్తీ అనియు రెండురూపములు వచ్చును * తేత్తీ అను పదమునందు తద్వయములో పూర్వమునకు లోపమును దానిస్థానములో నర్ధానుస్వారమును రాఁగా తేఁటి అని రావచ్చును.

చక్కఁదనము =చక్కని+తనము.

తీయఁదనము =తీయని+తనము.

తీయఁబోఁడి =తీయన+పోఁడి. తీయన - 'మాధుర్యము', పోఁడి-'పోలినది'; మాధుర్యమును బోలినది అనఁగా 'మనోజ్ఞురాలయిన ఆఁడుది' అని యర్థము.

పూఁబోఁడి =పూవునుపోలినది.

ననఁబోఁడి =నననుపోలినది; నన - 'పూవు'.

తలిరుఁబోఁడి =తలిరునుపోలినది, ఆంధ్రశబ్దతత్త్వము ౧౮౪ పు. చూడుము.

---

*తొల్గాప్పియమను వ్యాకరణమునందు అక్షరప్రకరణమునందు ౩౮౪-వ సూత్రముచూడుము.

౧౨. దీర్ఘపూర్వమయిన ద్విరుక్త హల్లు అంతమందు గలిగిన కొన్ని అరవపదంబులందు, ద్విరుక్తహల్లులలో మొదటి దానికి లోపమును, దానిస్థానములో నర్ధానుస్వారమును వచ్చి యుండవచ్చును.

తె. కాఁపు ... అ. కాప్పు. భా. నా.; కా – 'రక్షించుట,' పు-భావార్థక ప్రత్యయము.

" తోఁట ... " తోట్టమ్.

" గీఁటు ... " కీఱ్ఱు, భా. నా.; కీఱు–'గీచుట', ఉ-భావార్థక ప్రత్యయము. ఈ యు ప్రత్యయముచేరఁగా ధాత్వంతోకారమునకు లోపమును ఱకారమునకు ద్విత్వమును వచ్చినవి. అరవపదమునందలి దీర్ఘపూర్వమయిన ఱకారద్వయమునకుఁ దెనుఁగున టద్వయము.

" ఊఁట ... అ. ఊఱ్ఱు, భా. నా.; ఊఱు–'స్రవించుట,' ఉ – భావార్థక ప్రత్యయము. మిగిలినవి పై శబ్దమువలె. పదాంతోకారమునకు అత్వము.

,, తాఁకు ... ,, తాక్కు

,, తోఁపు ... ,, తోప్పు

,, తేఁకు } ... ,, తేక్కు
,, టేఁకు } ...

,, ఏఁకు ... ,, ఏక్కమ్. భా. నా. ఏక్కు-'ఏఁక రుట', అమ్ - భావార్థప్రత్యయము. ఏక్కు, అమ్ = ఏక్కమ్. అరవపదముయొక్క మాఁకు లోపము; దానికి పూర్వమయిన అకారమునకు ఉత్వము.

ఏఁకు అను శబ్దము ఏఁకారు అను పదంబునందు వచ్చుచున్నది.

ఏఁకు+ఆరు=ఏఁకారు. ఆరు-నిండుట.

II. కొన్నిపదంబులందు అర్ధానుస్వారము కారణములేకయే ప్రయోగముచేత సిద్ధించియున్నది:

ఉ. ఊఁదు ...అ. ఊదు.

వాఁడి ...,, వడి.

చూఁడు ...,, శుడు, సం. శుష్.

తోఁక ...,, తోగై.

పాఁచి ...,, పాశి, పశు-'పచ్చయయినది'

మేఁక ... సం. మేషః*

* గ్రీక్కులో మీకస్.

లోఁగు ...అ. ఉళవు. వకారమునకు గకారము. వర్ణవ్యత్యయవిధిచేత ఉళవు ళోవు అయినది. ళకారమునకు లకారము.

నాఁడెము ... సం. నాణకమ్, అ. నాణయమ్.

పోఁక ... ,, పూగః.

ఎలుఁగు ...అ. ఎణ్గు.

మీఁదు ...,, మీదు:

క్రోఁచ ...,, క్రోఞ్చై

ముసిఁడి ... సం. ముష్టిః.

కాఁకర ...అ. పాగల్, క. హాగలు. పకారమునకు తెనుగున కకారము.

ఏనుఁగు, ఏనుంగు
ఏనుఁగులు, ఏనుంగులు } ,, యానైగళ్; ప్రత్యయమునకు పూర్వము తెనుంగువారలు అనుస్వారమును అనావశ్యకముగా నుంచికొనిరి.

మడుఁగు, మడుంగు
మడుఁగులు, మడుంగులు } అ. మడిగళ్.

వెలఁగ, వెలంగ
వెలఁగలు, వెలంగలు } ,, విళగళ్.

పులుఁగు, పులుంగు
పులుఁగులు, పులుంగులు } అ. పుళ్గళ్

మునుఁగు, మునుంగు ... „ ముఱుగు, మూాట్లు.

పయ్యెఁట ... తె. పయ్యెద. ఎద హృదయశబ్ద
పయఁట భవము. పైయెద – 'హృద
పైఁట యముయొక్క పైభాగము'
అని వ్యుత్పత్త్యర్థము; 'అ
క్కడ ధరింపఁబడు వస్త్రము'.

మోఁదు ... అ. మోదు.

గేదఁగి, గేదంగి ... సం. కేతకీ.

పిఱుఁదు, పిఱుందు ... „ పృష్ఠమ్. ఈ శబ్దభవ
మయిన పెరడు శబ్ద
మునందు అనుస్వార
ము లేదు.

పీఁట ... „ పీఠః.

ఈఁగ, ఈఁగలు ... „ ఈక్కళ్.

నూఁక, నూఁకలు ... „ నొయ్గళ్.

కౌఁగిలి ... అ. కవ్వల్*, భా. నా. కవ్వు –
'ఆలింగనముచేయుట'.

---

* ఈ కవ్వల్ అనుపదమే గబ్బిలము, గబ్బిలాయి, గబ్బి
డాయి అని వికృతమయి తెనుఁగునకు వచ్చియున్నది. అరవ

క్రోఁతి ... క. కొడగితి, కొడత్తి. కొడతి క్రోతి యయినది. క్రోఁతిపదమునందు డకారస్థానములో నర్ధానుస్వారము. ఆ డకారమునకు రేఫాదేశము రాఁగా క్రోతి యని యుండవలయు. అర్ధానుస్వారమునుంచి క్రోఁతి యని చెప్పుట శాస్త్రవిరుద్ధము. ముందు ౭, ౮ పు. చూడుము.

ప్రాఁత ... అ. పఴైె. ప్రాచీనము పఴఙ్గమ్బు = ప్రాగెంపు అని వచ్చునట్లు పఴమ్ తెనుఁగునందు ప్రాఁ అయినది. పఴ అనునది పాత అనియు కావచ్చు. ఈ పదములోని పకారమునకు ప్రాఁ అనుశబ్దములోని రేఫమును జేర్పఁగా ప్రాత అని రావలయు; ప్రాతశబ్దములో అర్ధాను

---

ములో వౌవాల్ వవ్వాల్ అనునవి వవ్వల్ అనుదానినుండి వచ్చినవి. వవ్వల్ కవ్వల్ ఇవి ఏకార్థములు; 'నోటఁగఱచి పెట్టికొనుట' అని యర్థము.

స్వారమును ఉంచుటకు ఆధారము కనఁబడదు. *

ఒసఁగు, ఒసంగు †... అ. ఉదవు వకారమునకు గకారాదేశముగాఁగా అర్ధానుస్వారము ప్రమాణములేక గకారమునకు మునుపు వచ్చియున్నది.

వేసఁగి, వేసంగి ... సం. వైశాఖః. క. బేసిగె.

సంపఁగి, సంపంగి
సంపెఁగ, సంపెంగ
సంపఁగె, సంపంగె
సంపఁగియ, సంపంగియ } అ. శణ్బగమ్: సం. చంపకః.

**III.** క్రిందవచ్చు పదములందు శాస్త్రసిద్ధమయిన అర్ధానుస్వారము ప్రయోగముచేత లుప్తమయియున్నవి.

ఆకు ... అరవములో అడై పదమునకు 'ఆకు' అని అర్థము, దీనికి గుప్రత్యయమును జేర్చి ఐకారమునకు అకారాదేశముఁ

---

* అ. పొఴుదు, పూఁడు, పూఁట అనియు ప్రొద్దు అనియు వచ్చును. ప్రొద్దుపదములో అనుస్వారమును ఉంచి ప్రోఁదు అని చెప్పినట్లో అట్లే ప్రాఁత అనిచెప్పుట.

† గకారమునకు పూర్వమున్న అర్ధానుస్వారము గకారమునకు వకారాదేశముగాఁగా లోపించును.

జేయఁగా, అడగు అని వచ్చును; దీని కిని 'ఆకు' అనియే అర్థము; డకారములోపించి, పూర్వమయిన అకారమునకు దీర్ఘమును సామాన్యవిధి చేత డకారస్థానములో అర్ధానుస్వారమును రాఁగా ఆఁకు అని యుండ వలయు.

ఐదు ...అ. ఐన్దు.

మామిడి ...,, మావిన్. క. మావిన. పైఁ జెప్పఁబడిన పసిఁడి అను పదమును జూడుము.

ఓపు ...,, ఓర్ప్పు. భా. వా. అ. ఓర్-'క్షమించు,' పు-భావార్థక ప్రత్యయము; రేఫము లోపింపఁగా దానిస్థానమున అర్ధానుస్వారముండవలయు.

మోపు ...తె. మోయు+పు. మోయుధాతువునకు భావార్థక పు ప్రత్యయము రాఁగా ధాత్వంత యకారము లోపించినది. యకారస్థానమున అర్ధానుస్వారము లేకయున్నది.

దేశపు 'దేశసంబంధమయిన' } దేశంబు+ఉ; ఉకారము సంబంధార్థకము; పదాంతోకారమునకు లోపము.

=దేశం పు. బకారమునకు పత్వము.

=దేశ పు. అనుస్వారలోపము. అ. దేశత్తు.

బోటి ... పూఁబోఁడి, తలిరుఁబోఁడి, ననఁబోఁడి,తీయఁ బోఁడి అనుపదములు లోపించుటచేత బోఁడి అని వచ్చినది. ఇదియే డకారము నకు టత్వమురాఁగా బోఁటి అయినది. ఈపదమును పోలినది అను దానియొక్క వికృతమయి నప్పటికిని పైఁజెప్పిన పూఁ బోఁడి మొదలయిన పూర్ణపదములవలె ఇదియు స్త్రీకి పేరయినది. శాస్త్రసిద్ధ మయిన అర్ధానుస్వారము లోపించినది.

మూడు ... అ. మూన్రు. అకారమునకు డత్వము రాఁగా, మూఁడు అని యుండవలసినది. కొందఱు దీనిని అర్ధానుస్వారములేకయే ప్రయో గించియున్నారు.

మాపుడు ... , మాయ్వుదు. ఈపదము దకారమునకు డత్వ

మాపు మును వకారమునకు పత్వమును పదాంతో కారమునుబట్టి వర్ణసమీకరణవిధిచేత పకారముతోఁ జేరిన ఉకారమునకు ఉత్వ మునురాఁగా మాఁయ్పుడు అని నిలు చును. యకారలోపముచేత మాపుడు అని వచ్చినది. యకారస్థానములో నర్ధా నుస్వార ముండవలయు. పైఁజెప్పినవిధి

చేతనే అరవపదమయిన కాఱ్ఱప్పదు అను దానివలనఁ బుట్టిన కాఁపుడు అను తెనుఁగు పదమునందు లుప్తయకార స్థానమందు అర్ధానుస్వారము వచ్చెను. ముందు ౨౨-వ పుటను చూడుము.

తె. వచ్చుదాఁక...వచ్చున్+తనక; వచున్, వచ్చుధాతువు దనక యొక్క ధాతుజన్య భవిష్యదర్థక విశేషణము, 'రాఁగల' యని అర్థము.

అ. వరుమ్, క. బరువ, వచ్చుౝ పదముయొక్క నకారమునకు లోపమును దానిస్థానములో నర్ధానుస్వారమును తనక పదముయొక్క తకారమునకు దకారాదేశమును రాఁగా,

=వచ్చుఁదనుక.

=వచ్చుఁదాఁక. తనుకశబ్దము తాఁక అని సంక్షిప్తమయినది. ముందు ౧౧-వ పు. చూడుము. ఇక్కడ అర్ధానుస్వారము ఉండవలసినదానికి నిదర్శకముగా తాఁగుఁబోతు అనుపదమును చూడుము. ఇట్లు శాస్త్రసిద్ధమయిన అర్ధానుస్వారము ప్రయోగమునందు లేక పోయినది.

IV. పఢషసరళవములకుముందే అర్ధానుస్వారముండును. అర్ధానుస్వారమునకంటెఁ బరమయిన హల్లునకు స్థిరాదేశము వచ్చినయెడల అర్ధానుస్వారము లోపించును.

| | | |
|---|---|---|
| వేసవి | ... | వేసఁగి, వేసంగి |
| ఒసవు | ... | ఒసఁగు, ఒసంగు |
| మణువు | ... | మణుఁగు, మణుంగు |
| మెసవు | ... | మెసఁగు, మెసంగు |
| ఎసవు | ... | ఎసఁగు, ఎసంగు |
| మడువు | ... | మడుఁగు, మడుంగు |
| రేవు | ... | రేఁగు. |

V. హ్రస్వములకు వెనుకవచ్చెడు పూర్ణార్ధానుస్వారములు పరస్పరము మాఱును.

| | |
|---|---|
| అడంగు, అడఁగు | తరంగ, తరఁగ |
| కడంగు, కడఁగు | వెలంగ, వెలఁగ |
| మడంగు, మడఁగు | మునుంగు, మునుఁగు. |

VI. దీర్ఘమునకుఁ బరమయిన పూర్ణానుస్వారము అర్ధానుస్వారము అగును. దీర్ఘము సహజమయినను హ్రస్వమునకు ఆదేశమయినను ఈ కార్యమువచ్చును.

లేఁడు, ఇలండు

మోఁకాలు, క. మొణగాలు

సాఁబాలు, సగముపాలు

నేఁడు, అ. ఇన్రు
నాఁడు. ,, అన్రు
ప్రాఁబడు
తోఁడఁబుట్టు
వాఁడు, అవండు
వీఁడు, ఇవండు
లేఁగొమ్మ, అ. ఇళజ్గొమ్బు
ప్రాఁగెంపు, ,, పటిజ్గెమ్బు
పీఁచము, సం. పిఞ్ఛమ్
వేఁగి, తె. వెంగి
సైఁచు, సం. సహించు
దాఁక, దనుక
ఈఁక. అ. ఇఱగు.

ఈశబ్దములందు దీర్ఘము హ్రస్వమునకు ఆదేశమయి వచ్చెను.

| | |
|---|---|
| మేఁత, మేయు+త | ఏఁడు, అ. ఆణ్డు |
| కోఁత, కోయు+త | వేఁడు, ,, వేణ్డు |
| ఊఁత, ఊను+త | కాఁడ, సం. కాండః |
| మూఁగు, మూయు+గు | గూఁడు, అ. కూణ్డు |
| నాఁగెలు, సం. లాంగలమ్ | దాఁటు ,, తాణ్డు |

ఈశబ్దములందు దీర్ఘము సహజము.

VII. అర్ధానుస్వారమునకుఁ బరమయిన హల్లు సంయుక్తమయినయెడల అర్ధానుస్వారము పూర్ణమగును.

అనఁటి, అనఁటి+ఉలు = అనఁటులు-అనంట్లు. అనఁటులు అనుదానియందు ఉలు ప్రత్యయముయొక్క ఉకారము లోపింపఁగా, టకారముతోఁ జేరి లకారము సంయుక్తమయ్యె. ఇట్లు—

పనఁటి – 'వంటకుండ' ... పనఁటులు, పనంట్లు – 'వంటకుండలు.'

గోఁటు ... ... గోఁటులు, గోంట్లు

తేఁటి ... ... తేఁటులు, తేంట్లు

ఏఁడు ... ... ఏఁడులు, ఏండ్లు

కాఁడు ... ... కాఁడులు, కాండ్లు.

VIII అర్ధానుస్వారముచేత పదముల విభక్తిస్వరూపము వ్యక్తమగును. దానిని ఎత్తివేసినయెడల విభక్తిస్వరూపము తెలియకయుండును.

ఉ. పులి మేఁకఁ దినెను.

ఈవాక్యమునందు మేఁకను అనునది మేఁకశబ్దము యొక్క ద్వితీయా విభక్తిరూపము. ఇది తినెను అనుపదముతోఁ చేరఁగా మేఁకఁదినెను అనివచ్చును. అర్ధానుస్వారమును వ్రాయనియెడల మేఁకదినెను అనివచ్చును. అప్పుడు వాక్యము 'పులిమేఁకదినెను'

అనియుండును ఈవాక్యమునకు అర్థము పులిని మేఁక దినెను అనిగాని, మేఁకను పులి దినెను అని గాని యుండవచ్చును. కాఁబట్టి వాక్యార్థము సందిగ్ధ మగును.

వారలఁగొట్టు.

ఈ వాక్యమునకు – 'వారలనుకొట్టుము' అని యర్థము. అర్ధానుస్వారమును ఎత్తివేసినయెడల వారల అనునది షష్ఠీవిభక్తి తుల్యంబగును, అప్పుడు వారల యొక్క గొట్టు – 'దౌష్ట్యము' అను నర్థము నిచ్చును.

IX. అర్ధానుస్వారముచేత వేర్వేఱు అర్థముగలిగిన వేర్వేఱు పదములభేదములు చక్కఁగాఁదెలియుఁడు.

కాఁచు – 'కాఁగఁజేయు', కాచు – 'ఫలించు' 'రక్షించు'

కాఁక – 'ఉష్ణము' కాక – 'ఒకపక్షి'

కాఁపు – 'కాఁపురము' కాపు – 'కాచుట'

ఏఁడు – 'సంవత్సరము' ఏడు – 'ఆఱునొకటి'

ఏఁచు – 'బాధించు' ఏచు – 'అతిశయించు'

ఆఁడు – 'ఆఁడుఁదనము' ఆడు – 'నటించు'

అఁట (అనుతారు) 'అని చెప్పుచున్నారు' } అట – 'అచ్చట'

చేఁత – 'చేయుట'  చేత – తృతీయావిభక్తి ప్రత్యయము.

తోఁడు – 'కెలగించు'  తోడు – 'సహాయము.

X. అర్ధానుస్వారముచేత పదవ్యుత్పత్తి తెలియును, అది లేక పోయిన వృత్తి మఱుఁగియుండును. మొదటివిధిలో నుదాహరింపఁబడిన పదములెల్ల నిచ్చట నుదాహరణముగా నుండఁదగును, వానిని అక్కడ చూచికొన వచ్చును.

అర్ధానుస్వారతత్త్వమును ఇప్పుడు ముద్రించుచువచ్చు ఆంధ్రశబ్దతత్త్వమను గ్రంథమునందు సవిస్తరముగాఁ జెప్పియున్నాను జిజ్ఞాసువులు ఆగ్రంథము ముద్రితమయిన వెనుక దానిలోఁ జూడవచ్చును. *

---

* తర్వాత నది ముద్రితమైనది. ఇప్పుడు పునర్ముద్రితమైనది. వె. కం.

శ్రీ

# ప ద సూ చి క

---

ఇందలి సంఖ్యలు పుటలను దెలుపును.

## పద సూచిక.

## పద సూచిక.

## పద సూచిక.

చంద్రికాప్రెస్సు, చాకలపేట, మదరాసు.—15-3-49.